THE ANDHRA PATRIKA, MADRAS.

# ఆంధ్రపత్రిక

3/8070

Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 171 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO. శనివారం 22–9–1951 వెల 1 అణా, హో 0–1–2.





# అక్టోబర్ 2 లోపుగనే ఆంధ్రరాష్ట్రనిర్మాణంపై ప్రకటన రావచ్చు

## దీక్ష విరమించిన వారి ఆహారం
—(०)—
### స్వామీజీ హితవు

గుంటూరు, సెప్టెంబరు 20: ఉపవాసం చేసినవారు నిమ్మకాయ రసము పానకంమాత్రమే పుచ్చుకొని దీక్షవిరమణ చేయవచ్చునని స్వామీ సీతారాం తెలియచేశారు. ఈ విధంగా ఒక వారంరోజులు, ఆ తరువాత మరొక వారంపాటు ద్రవరూపంలో వుండే ఆహారమూ, మూడవవారంలో ఉప్పు, కారమూ తగిలని కాయగూరలు తినాలనీ, నాలుగవ వారంలో క్రమేపీ మామూలు భోజనానికి అలవాటుచేసుకోవచ్చుననీ ఆయన సలహాయిస్తున్నారు. (స్వ. వి.)

## ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు సంజీవరెడ్డిగారి విశ్వాసం

### స్వామీజీదీక్షావిరమణకు హర్షం: తమ తీర్మానాన్ని తమిళ, కర్నాటక సంఘాలకు పంపినట్లు వివరణ

మద్రాసు, సెప్టెంబరు 21: "స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశాన్ని విరమించినందుకు నేనెంతో సంతోషిస్తున్నాను. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సమస్యపై స్వామిజీ ఎంతో కాంతిని ప్రసరింపచేశారు. అక్టోబరు 2–వ తేదీనాటికి గాకపోయినా కొంచెం ముందు వెనకగానైనా ఆంధ్రరాష్ట్రం రాగలదని విశ్వసిస్తున్నాను," అని ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు, స్వామిజీ ప్రభృతుల దీక్షావిరమణను గూర్చి ఆంధ్రపత్రిక ప్రతినిధికి చెప్పారు.

సంజీవరెడ్డిగారు ఇల్లా చెప్పారు:– "పరిపాలనకు సంబంధించిన అనేక కారణాలవల్ల అక్టోబరు 2వ తేదీకి రాష్ట్రం రావడం అంత సులభం గాదు. అయితే ఆ తేదీ లోపల రాష్ట్ర నిర్మాణ ...నిశ్చయించామని ప్రకటనభారతప్రభుత్వం చెయ్యవచ్చు.

(2–వ పేజీ చూడుడు)

## రష్యా విషయంలో అమెరికా రాజనీతిపైగాక, బలంపైనే ఆధారపడుతున్నదని ట్రూమన్

వాషింగ్టన్, సెప్టెంబరు 20: "రష్యాతో వ్యవహరించడంలో అమెరికా రాజనీతిపై కాక బలంపైనే ఆధారపడుతున్న"దని అధ్యక్షుడు ట్రూమన్ నేడిక్కడ ప్రకటించారు.

పత్రికా విలేఖరులతో గోష్టిలో ఆయన ఇలా చెప్పారు:– "బలంపై ఆధారపడి ఇతర దేశాలతో వ్యవహరించడం వాంఛనీయంకాదు. అయినా ప్రస్తుత పరిస్థితులలో ఇంతకన్న గత్యంతరం లేదు. బలం ఉపయోగించవలసిన అవసరం లేకుండా, చర్చల ద్వారా సమస్యలు పరిష్కరించుకొనే నిమిత్తమే ఐక్యరాజ్య సమితిని నెలకొల్పడమైనది. కాని, ఈ పద్ధతి సఫలం చెందడం దుస్తరమైనది. దీనికి కొరియా ఒక ఉదాహరణ."

రష్యాతో జరుపుతున్న ఒడంబడికలు చిత్తుకాగితాలతో సమానమంటూ ఆయన ఇటీవల ప్రకటించారు. ఆ ప్రకటన దృష్ట్యా ఇకముందు రష్యాతో ఒడంబడికలు జరుపుతున్న ప్రయత్నాలు విరమిస్తారా అని ఒక విలేఖరి ప్రశ్నించారు. దానికి ట్రూమన్ ఇలా సమాధానం చెప్పారు:– అట్టి ఒడంబడికలను అమలు పరచగలిగిన స్థితిలో మనం ఉన్నట్లయితే వాటిని రష్యా పాటిస్తుంది. అందువల్ల రష్యాతో ఒడంబడికలు జరుపుకొనడానికే మనం ప్రయత్నించగలము. ఈ రక్షణ సన్నాహాలు చేయడానికి కూడా ఇదే కారణం."

శాన్ ఫ్రాన్సిస్కో సమావేశంలో రష్యా ఓటమి, ఉత్తర అట్లాంటిక్ సంధి రాజ్యాల నూతన నిర్ణయాలు, అమెరికాలో పరమాణుశక్తి పరిశోధన అభివృద్ధిదృష్ట్యా "ప్రచారయుద్ధం"లో రష్యా ఓడిపోయినట్లు భావిస్తున్నారా? అని మరొక విలేఖరి ప్రశ్నించాడు.

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పలేనంటూ ఆయన ఇలా వ్యాఖ్యానించారు:– "ఫలితాలకై అమెరికా నిరీక్షించి ఉండాలి. అమెరికా రక్షణ సన్నాహాలు కొనసాగించినట్లయితే ప్రపంచానికి శాంతిలభించే అవకాశాలు బలపడగలవు."

### మరుసటి అధ్యక్ష ఎన్నిక

వచ్చే ఏడాది అమెరికా అధ్యక్ష పదవికి జరిగే ఎన్నికలలో పోటీ చేస్తారా అని విలేఖరులు ప్రశ్నించగా సమాధానం చెప్పడానికి ట్రూమన్ నిరాకరించారు. అయితే డెమోక్రాటిక్ పక్ష కార్యక్రమం నిర్ణయించడంలో పాల్గొనవున్నట్లు ఆయన చెప్పారు.

## ఉత్తర అట్లాంటిక్ రాజ్యాల వ్యవస్థ

ఒట్టావా, సెప్టెంబరు 20: ఉత్తర అట్లాంటిక్ సంధి సంస్థలో గ్రీసు, టర్కీ దేశాలను చేర్చుకొనడానికి 12 ఉత్తర అట్లాంటిక్ సంధి రాజ్యాల విదేశాంగ మంత్రులు ఈ రోజున ఏకగ్రీవంగా నిశ్చయించారు.

## పాక్ ఎన్నికలు: ఖిద్మత్గార్ల నిర్ణయం

లాహోర్, సెప్టెంబరు 20: ఇప్పుడు అనుకుంటున్న ప్రకారం వచ్చే నవంబరులో పాకిస్తాన్‌లో జనరల్ ఎన్నికలు జరుగుతాయి; కుదై ఖిద్మత్గార్లు ఈ ఎన్నికలలో పాల్గొనకూడదని నిశ్చయించుకున్నారు. కుదై ఖిద్మత్గార్ల ఈ నిర్ణయానికి రెండు కారణాలు వున్నాయి. ఒకటి, ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్ మొదలైన రెడ్ షర్టు నాయకులను పాకిస్తాన్ ప్రభుత్వం నిర్బంధంనుంచి విడిచిపెట్టకపోవడం. రెండు, ప్రస్తుత ప్రభుత్వం క్రింద పాకిస్తాన్‌లో పౌరస్వాతంత్ర్యాలనేవి పూర్తిగా మృగ్యమైపోవటం.

## విశాఖ నౌకా నిర్మాణశాల నిర్వహణకు కార్పొరేషన్

### నూటికి 60 వంతులవరకూ వాటాధనం పెట్టడానికి భారతప్రభుత్వ నిర్ణయం

[ఆంధ్రపత్రిక విలేఖరి]

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: భారత నౌకా నిర్మాణ పరిశ్రమకు సహాయం చేయడానికి భారతప్రభుత్వం తాత్కాలిక నిర్ణయాలు చేసిందని ఇక్కడ విశ్వసిస్తున్నారు. విశాఖ పట్నములోని సింధియా నౌకా నిర్మాణ శాలను సింధియా కంపెనీ వారివద్ద నుంచి తీసికొని నిర్వహించడానికి ఒక కార్పొరేషను స్థాపిస్తున్నారని లాబివర్గాలవారు చెప్పుతున్నారు. ఈ సంస్థలో ప్రభుత్వంవారు పెద్దభాగస్థులుగా వుంటారు. ఈ కంపెనీ వాటాలలో 100 కి 52 నుండి 62 వరకు వాటాలను ప్రభుత్వం తీసికొంటుంది, తక్కిన వాటాలను సింధియాలు తీసికొంటారు. రెండు సంవత్సరాల క్రిందట సింధియాలు నిర్మించిన 8 నావలకు 80 లక్షల రూపాయలు సబ్సిడీ యివ్వడానికి ప్రభుత్వంవారు సమ్మతించారు. 120 లక్షల రూపాయలు సబ్సిడీగా యివ్వాలని సింధియాలుకోరారు. కాని కొరియా యుద్ధం మూలాన నావలధర పెరగడంవల్ల ప్రభుత్వంవారు సబ్‌సిడీ తగ్గించారు. ఇది గాక 1950-51, సం॥ములలో నాలుగు మూడు నావలు నిర్మించినందుకు గాను ప్రభుత్వంవారు సబ్సిడీ యిస్తున్నారు. నావకు దాదాపు 20 లక్షల రూపాయల సబ్సిడీ యిస్తున్నారు, ముందు గూడా ఈ సబ్‌సిడీ యిస్తారు. ముందేర్పరుప దలుస్తున్న కార్పొరేషనుకు యిస్తారు. కాని సబ్‌సిడీ కొంత తగ్గుతుంది. నాలుగు మూడు నావలకంటె ఎక్కువగా నిర్మించే రీతిగా నౌకా నిర్మాణశాలనువిస్తరించవలసివుంటుంది

### మంత్రుల సంచారాలు: ఎన్నికలు

మద్రాసు, సెప్టెంబరు 21: మదరాసు మంత్రులు, కాంగ్రెసు ఎన్నికల సంఘ సంచారాల్లోను ఎన్నికల సంచారాల్లోను ప్రభుత్వ ధనం నుంచి ట్రావెలింగు అలవెన్సు తీసుకోరాదని మద్రాసుమంత్రివర్గం తీర్మానించింది.

## దక్షిణ బొంబాయి రాష్ట్రంలో విరివిగా గంధకం లభ్యం

బొంబాయి, సెప్టెంబరు 20: బొంబాయిరాష్ట్రం దక్షిణాన వున్న కొండప్రాంతాల్లో గంధకం విస్తారంగా కనబడడంవల్ల భారతదేశంలో గంధకం విస్తారంగా ఉత్పత్తిఅయ్యే అవకాశము, విదేశీయ మార్కెట్లకు గంధకం సరఫరా చేసేవారిలో భారతదేశం అగ్రస్థానం వహించే అవకాశము యేర్పడింది, అన్ని ముఖ్య పరిశ్రమలకూ గంధకం అవసరము. 12 మైళ్ళ ప్రాంతం గంధకంతో నిండివున్నదని లక్షలకొలది టన్నుల గంధకం లభ్యమయ్యే అవకాశం వున్నదని చెప్పుతున్నారు. ఆ ప్రదేశాన్ని సర్వే చేసి, అచ్చట ఎంతగంధకం లభ్యమవుతుందో అంచనా వేయడానికి భారతప్రభుత్వ భూగర్భ శాస్త్రజ్ఞులు నేడు బొంబాయి నుండి బయలుదేరివెళ్లారు.

## విజయవాడ మునిసిపల్ కమిషనర్ మృతి

విజయవాడ, సెప్టెంబరు 21: గత రాత్రి విశాఖపట్టణం కింగ్ జార్జి ఆస్పత్రిలో విజయవాడ మునిసిపల్ కమిషనర్ ఎం. ఎ. రహమాన్‌గారు తమ 51 వ ఏట మృతినొందారనే వార్తను అందచేయ విచారిస్తున్నాము. వీరికి మాతృశోకం చెడిపోయింది. ఆయనకు భార్య, నలుగురు కుమార్తెలువున్నారు. కుమార్తెలలో వహీదా, వహీదా అను వారు లోగడ అనేక నాట్యప్రదర్శనాలలో పాల్గొని ప్రఖ్యాతినొందారు. రహమాన్‌గారి స్మారకంగా స్థానిక మునిసిపల్ కార్యాలయా లన్నిటినీ మూసివేశారు. (స్వ. వి.)

## 'అక్టోబరు 2 నాటికి రాష్ట్రనిర్మాణం సాధ్యమే'

### స్వామీ సీతారాం తంతిపై వినోబాభావే ప్రకటన

సింగోడి (చింద్వారా), సెప్టెంబరు 20: వివాదగ్రస్తమైనప్రాంతాలజోలికి పోకుండా ఉన్నట్లయితే, స్వామి సీతారాం కోరినప్రకారం అక్టోబర్ 2–వ తేదీనాటికి ఆంధ్రరాష్ట్రం యేర్పాటుచేయడం సాధ్యమేనని, అచార్యవినోబాభావే, యీ వేళ ప్రార్థన సభలో ప్రసంగిస్తూ అన్నారు.

ఈమధ్యస్థితిని పాటించి స్వామి సీతారాం ప్రాయోపవేశం విరమించినందుకు వినోబాభావే హర్షం వెల్లడించారు. వినోబాభావే ప్రార్థన సమావేశంలో మాట్లాడుతూ యిలా అన్నారు.

"స్వామి సీతారాం వివరించిన ఒక విషయాన్ని గురించి నేనిప్పుడిక్కడ చెప్పవలసి ఉన్నది. ఎన్నికల తరువాత ఆంధ్రరాష్ట్రం యేర్పరుస్తామని ప్రభుత్వం వెంటనే ప్రకటించాలని ఆయన కోరుతున్నట్లుగా నేను అభిప్రాయపడ్డాను. ఈ అభిప్రాయం సరిగాదు. తక్షణం ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలనే ఆయన కోరుతున్నారు. వివాదగ్రస్తమైన ప్రాంతాలను ప్రస్తుతము వదలివేసినట్లయితే స్వామి సీతారాం కోరుతున్న ప్రకారం వెంటనే రాష్ట్రం యేర్పాటు చేయడం సాధ్యమేనని నా అభిప్రాయం."

### నెహ్రూ, రాజెన్‌బాబులకు స్వామీజీ తంతి

గుంటూరు, సెప్టెంబరు 20: 36 రోజులనుంచి సాగిస్తున్న ప్రాయోపవేశం కటికపై విరమిస్తున్నామని, అయినా అక్టోబరు 2 నాటికే ఆంధ్రరాష్ట్రం యేర్పాటు కావాలని స్వామి సీతారాం, భారత రిపబ్లికు అధ్యక్షులైన డా॥ రాజేంద్రప్రసాదుకు, ప్రధానమంత్రి నెహ్రూకు యీ వేళ తంతి పంపారు.

### 'సద్భావశక్తి'

#### స్వామికి వినోబాభావే తంతి

గుంటూరు సెప్టెంబరు 21: మీరు ప్రాయోపవేశదీక్షను, విరమించడంతో యిప్పుడిక "సద్భావమనే శక్తి" పని చేస్తున్నది. అని ఆచార్య వినోబాభావే స్వామీసీతారాంకు తంతిపంపారు.

ప్రాయోపవేశం విరమిస్తున్నానని స్వామీజీ విన్న పంపిన తంతికి, వినోబాభావే సమాధానమిది.

కళా వెంకట్రావుగారు స్వామి సీతారాంగారిని లోగడ ప్రకటించినట్లుగా గుంటూరులో కాక, వినయాశ్రమంలో యీ 26 న కలుసుకోదలచినట్లు తెలియవచ్చింది.

## రాష్ట్రనిర్మాణ సమస్యపై పార్లమెంటు ఆంధ్రసభ్యుల విశ్వాసం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 20: విభజనసంఘ నివేదిక శిఫార్సులను అంగీకరిస్తూ ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సెప్టెంబర్ 14 న నెల్లూరు సమావేశంలో తీర్మానించి ఉన్నది. గాబట్టి, యిక తమిళనాడు, కర్ణాటక్ ప్రదేశ్ కాంగ్రెసు సంఘాలు మద్రాసు ప్రభుత్వము, యీ శిఫార్సులను అంగీకరించినట్లు లిఖితపూర్వకంగా తెలియపరచినవెంటనే, కేంద్రప్రభుత్వం ఆంధ్రరాష్ట్రనిర్మాణం విషయమై తన విధానాన్ని వివరిస్తు ప్రకటనచేస్తుందని పార్లమెంటులోని ఆంధ్రసభ్యులు గట్టి నమ్మకంతో ఉన్నారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం తమకు సమ్మతమేనని తమిళ కాంగ్రెసు అధ్యక్షుడు కామరాజనాడారు, కర్ణాటక కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్ప, మద్రాసురాష్ట్ర ముఖ్యమంత్రి కుమారస్వామిరాజాగారలు, యిదివరకే బహిరంగంగా ప్రకటించి ఉన్నారు. కాబట్టి, జె. వి. పి. నివేదికను అంగీకరిస్తూ తమిళ, కర్ణాటక కాంగ్రెసు సంఘాలు, మద్రాసు ప్రభుత్వము తీర్మానాలు చేసి పంపడం తథ్యమని కూడా యీ ఆంధ్ర సభ్యులు విశ్వసిస్తున్నారు.

జె. వి. పి. నివేదిక, విభజనసంఘ శిఫార్సులు, మద్రాసు నగరం ఆంధ్రరాష్ట్రంలో చేరరాదని స్పష్టీకరిస్తున్నాయి గనుక, మద్రాసు నగరంపైని వాదనను యిప్పుడు లేవదీయడానికి వీలులేదని వారి అభిప్రాయం.

## కొట్టంపూడి పొలాలలో పెద్దసారాబట్టీలు

### 11 జాడీల సారా స్వాధీనం

ఏలూరు, సెప్టెంబరు 20: గత ఆదివారంనాడు, శ్రీ జేసపతి డిప్యూటీ సూపరింటెండెంటు కె. శ్రీ కుమారనాయన్, సబిన్స్పెక్టర్ టి. శ్రీరామమూర్తిగార్లు కొట్టంపూడి పొలాలలో పెద్దపెద్దగా సాగుతున్న సారాబట్టీలను పట్టుకున్నారు. అక్కడ 11 జాడీల సారాయి, పెద్ద కుండలనిండా పులిసిన ద్రవము, స్వాధీనపర్చుకొన్నారు. పోలీసువారిరాక చూచి, అక్కడ 100 కుండలు పగులగొట్టబడ్డాయి. 15 మంది గ్రామస్థులు అరెస్టుచేయబడ్డారు.



## ఎన్నికల్లో గెలుపు తమదేనని బ్రిటిష్ ప్రధాని విశ్వాసం

లండన్, సెప్టెంబరు 20: "గెలుపొందగలమనే విశ్వాసంతో బ్రిటిష్ కార్మికపక్షం రాబోయే ఎన్నికలలో పాల్గొనమన్న"దని బ్రిటిష్ ప్రధానమంత్రి అట్లీ నేడిక్కడ ప్రకటించారు.

"టోరీల ప్రభుత్వం క్రిందకన్న కార్మికపక్ష ప్రభుత్వంక్రింద బ్రిటిష్ ప్రజల పరిస్థితులు ఎక్కువగా చక్కబడినవి. ఈ విషయాన్ని ఎవరూ కాదనలే"రని ఆయన చెప్పారు.

ఈ వారాంతంలో జరిగే స్కాట్లండ్ కార్మికపక్ష సమావేశంలో పాల్గొనే నిమిత్తం అట్లీ నేడిక్కడి నుండి బయలుదేరారు.

### చర్చిల్ వ్యాఖ్య

అక్టోబరు 25 వ ఎన్నికలు జరపడానికి కార్మికపక్ష ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంపై వ్యాఖ్యానిస్తూ కన్సర్వేటివ్ పక్ష నాయకుడు విన్‌స్టన్ చర్చిల్ ఈ రోజున ఇలా ప్రకటించారు:–

"ఇకముందు బ్రిటన్ అనుసరించవలసిన మార్గాన్ని నిర్దేశించడానికి బ్రిటిష్ ప్రజలకు ఈనాడు ఒక అవకాశం లభించినది. బ్రిటిష్ ప్రజలు కోరితే, సామ్యవాదసిద్ధాంతాలకు కట్టుబడకుండా మన సమస్యలను తగినట్లు పరిష్కరించ గలిగిన కన్సర్వేటివ్ పక్షాన్ని ఎన్నుకొనగలరు. ఏదైనా దేశంలో సుస్థిరమైన ప్రభుత్వం ఏర్పడవలసిన ఆవశ్యకత ఉన్నది."

లిబరల్ పక్ష నాయకుడు క్లిమెంట్ డేవిస్ ఇలా ప్రకటించారు:– "కొత్త ఎన్నికలు జరిపి, ప్రజల అభిమతాలను తెలుసుకొనడానికి ప్రభుత్వం నిర్ణయించడం తగియున్నది. గత 18 మాసాలుగా కార్మికపక్ష ప్రభుత్వ పరిస్థితి చాల బలహీనంగా ఉన్నది. ఈ కాలంలో ప్రభుత్వం దేనిని సాధించలేకపోయినది"

### బివాన్ వర్గం విమర్శ

మాజీ కార్మికశాఖామంత్రి ఎన్యూరిన్ బివాన్ నాయకత్వం క్రింద ఉన్న సోషలిస్టులు కార్మికపక్ష పునరాయుధీకరణ విధానం విమర్శిస్తూ మరొక కరపత్రం ప్రకటించారు. దానిలో ఇలా ఉన్నది:–

"ప్రభుత్వం తలపెట్టిన బ్రహ్మాండమైన పునరాయుధీకరణ కార్యక్రమం అమలు పరచడం బ్రిటన్ శక్తికి మించినదని మేము లోగడ చేసిన విమర్శ సరిఅయినదని ఈనాటి ప్రపంచ పరిస్థితులవల్ల ఋజువు అయినది. వెనుకబడిన దేశాలలోని ప్రజల పరిస్థితులు, నిరాధారమైన భయం కారణంగా పునరాయుధధారణకు పూనుకొనడము నిజంగా అపాయకరమైన విషయాలు. ఈ విషయాలను మరుగు పరచడానికి కార్మికపక్ష నాయకులు ప్రయత్నిస్తున్నారు"

### కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థులు

రాబోయే ఎన్నికలలో 25 నియోజకవర్గాలలో మాత్రమే బ్రిటిష కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థులు పోటీ చేస్తారని పార్టీ ఈ రోజున ప్రకటించినది. వుడ్‌ఫర్డు నియోజక వర్గాలలో కన్సర్వేటివ్ పార్టీ నాయకుడు చర్చిలుతో కమ్యూనిస్టు పార్టీ పత్రిక "డెయిలీ వర్కర్" సంపాదకుడు ఆర్. పాంట్ బెల్ పోటీ చేస్తారు. కమ్యూనిస్టుపార్టీ ఉపాధ్యక్షుడు శ్రీ రజని పామీదత్తు లండన్ కౌంటి కౌన్సిల్ లో కన్సర్వేటివ్ పార్టీ నాయకుడు డాక్టర్ హేగ్రిడమాన్‌తో పోటీ చేస్తారు. క్రిందటి ఎన్నికలలో 100 మంది కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థులు పోటీ చేశారు. లూయిషామ్ నార్త్ నియోజకవర్గంలో హెర్బర్టు మారిసన్‌తో ఒక కమ్యూనిస్టు అభ్యర్థి పోటీ చేస్తారు.

## విజయవాడలో మ్యూజియం

విజయవాడ, సెప్టెంబరు 20: ఆంధ్రరాష్ట్ర కేంద్ర పురావస్తు ప్రదర్శనశాలను యిక్కడ స్థాపించే విషయంలో పరిశీలనలు జరుపటానికి భారతపురావస్తుశాఖ డైరెక్టరు జనరలు మాధవస్వరూప్ వాట్స్‌గారు విశాఖపట్టణం పురావస్తుశాఖ సూపరింటెండెంటు వి. డి. కృష్ణస్వామిగారితో కలిసి యిక్కడకు యీ 24 న రానున్నారు. ఆ నాడు వారు యిక్కడ కొండలు తొలిచికట్టిన దేవాలయాలను తిలకిస్తారు. ఈ 25 న అమరావతిలోని ప్రాచీన స్థానాలను, 26 న నాగార్జున కొండలోని బౌద్ధ శిథిలాలను చూస్తారు. స్వ. వి.

## టెండరు నోటీసు

విజయనగరం మునిసిపాలిటి,

ఈ మునిసిపాలిటి వీధిదీపముల నిమిత్తము మెర్క్యూరీ వేపర్ లైట్లు 125 వాట్లవి 10, 250 వాట్లవి 10 సప్లయిచేయుటకు సీలు వేసిన టెండర్లు 12-10-51 తేది సాయంత్రం 4 గంటల వరకు తీసుకొనబడును. కావలసిన రెండు రకముల లాంపులకు స్పెసిఫికేషనుల వివరములు తెలియపరచుచు, పూర్తి సెట్టుకు రేటు తెలుపవలెను. ఒక్కొక్కదాని శాంపిలు అడిగినయెడల పంపవలెను. టెండరు అంగీకరింపనిచో, సదరు శాంపిలు వాపసు చేయబడును. టెండర్లతో రు॥ 125/- ల డిపాజిట్టు కట్టవలెను.

కమీషనరు.

## ప్రకటన

మా వద్ద గుమాస్తాగా వున్న ... సేపల్లి కృష్ణమూర్తి రు 350/- లను 11, 12, తేదిలలో వసూలు చేసి కొని, సదరు సొమ్మును మాకు ఒప్పగించకుండా పరారై యున్నాడు. ట్రావిలింగు రశీదుల పుస్తకమును మాత్రము కృష్ణమూర్తి ...

## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద బ॥ సప్తమి

1951 సం॥ సెప్టెంబరు 22 శనివారం

శ॥ సప్తమి రా 8-33 రో ఛ 7-56

వర్జ్యం ప 2-11 ల 3-59 కు.

బ॥ అష్టమి సెప్టెంబరు 23 ఆదివారం

ఆ॥ అష్టమి రా 10-57 మృ ప.10-40

వర్జ్యం రా 8-12 ల 10-0 కు.



# ఆంధ్రపత్రిక

ఒరు లేయవి యనరించిన నరవం, యుప్రియము తన మనంబునకగు దా నొరులకు నవి సేయకునికి పరాయణము పరమధర్మపథముల కెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద బ॥ సప్తమి

శనివారం

## కొరియాసంప్రతింపులు

కేసాంగ్ సంప్రతింపులువిర ...

# దేశ విభజన గాథ: మౌంట్‌బాటెన్‌దౌత్యం

## రేపటినుంచి 'ఆంధ్రపత్రిక'లో అనుదిన ప్రచురణ

భారతదేశ రాజకీయ సమస్యా పరిష్కారం విషయంలో బ్రిటిష్ మంత్రివర్గం పథకానికి ఏ కారణంచేత స్వస్తి చెప్పవలసి వచ్చింది,



కాశ్మీర్ సమస్య ఏ విధంగా ఉత్పన్నమైంది, అక్కడ జన వాక్య నిర్ధారణ ప్రసక్తిని ముందుగా ఎవరు తెచ్చింది, రజాకార్ల ఉధృతంతో హైద్రాబాద్ సమస్యక్లిష్ట పరిణామాలకు ఏ విధంగా వచ్చింది, మౌంట్‌బాటెన్ ముఖ్య అంతరంగిక అనుచరుడుగా పనిచేసిన అలాన్ కాంప్‌బెల్ జాన్సన్ ఈ గ్రంథంలో సవిస్తరంగా ప్రకటించారు.

పంజాబు, బెంగాలు రాష్ట్రాల విభజనకు మొదట ససేమిరా సమ్మతించని ముస్లింలీగు నాయకుడు జిన్నా బ్రిటిష్ కన్సర్వేటివ్ నాయకుడు చర్చిల్ వ్రాసిన లేఖతో ఏ విధంగా అమాంతం దిగివచ్చింది, కాశ్మీర్‌పై కొండజాతుల దండయాత్రను జిన్నా ఏ విధంగా ఆదేశించింది, మొదలైన అనేక అత్యంత అంతరంగిక విషయాలు అధికార పూర్వకంగా మొట్ట మొదటిసారిగా దీనిలో బయటపడినవి.

ఇప్పటివరకూ ప్రజాబాహుళ్యానికి తెలియని అనేక రహస్యవిషయాలను తెలుసుకునే సదవకాశం ఈ వ్యాసావళివల్ల పాఠకులకులభ్యమౌతుంది.

వీటిని తెలుగులో ప్రకటించే ప్రత్యేక హక్కులను 'ఆంధ్రపత్రిక' సేకరించిందని పాఠకులకు మనవి.

# సిక్కు, జైన, బౌద్ధమతాలవారికి కూడా హిందుకోడ్ బిల్లు వర్తింపు

## 2 వ క్లాజుకు పార్లమెంటు ఆమోదం

న్యూఢిల్లీ సెప్టెంబరు 20: పార్లమెంటు నేడు హిందూకోడ్ బిల్లు రెండో అంశాన్ని ఆమోదించింది. ప్రస్తుతానికి హిందూ ధర్మ సంస్కారంలో పెళ్లి విడాకులు వీటికి సంబంధించినదై మాత్రమే ఈ బిల్లు వుంటుంది.

దీనిని సిక్కులకు పట్టించరాదని సర్దార్ భూపేంద్రసింగ్ మాన్ వాదిం...

శాసనాల నిర్బంధాలుగా విధించబడి వుండటాన్ని పేర్కొని, అట్టి స్వాతంత్ర్యం ఇచ్చినట్లయితే రాష్ట్రానికి ఒక ధర్మం చెప్పిన అంతా కలగాపులగం అయిపోగలదని వాదించారు. ఇట్టి విషయాలలో శాసనం అవసరం అంటారా, దేశం అంతటికి అది అనువర్తించేదిగా వుండాలి. అట్లా కాదంటే, అసలు శాసనమే అనవసరం ...

## మెహతాబ్ లండన్ పయనం

... వారం జరగబోయే కామన్వెల్తు సివిల్ సరఫరా మహాసభలో పాల్గొనడానికని కేంద్ర పారిశ్రామిక, వాణిజ్యమంత్రి హరేకృష్ణ మెహతాబ్ గారు ఇవాళ విమానంలో లండను బయలుదేరి వెళ్లారు.

# పట్టపగలు కలకత్తా బ్యాంకు దోపిడి: ప్రజల సాహసం

కలకత్తా, సెప్టెంబరు 20: ఆయుధపాణులైన దుండగులు ఒక కలకత్తా బ్యాంకు బియోమర్ శాఖలోనికి ప్రవేశించి రివాల్వర్లుచూపి రెండు లక్షల రూపాయలు దోచుకొని పోయారు. కాని ప్రజలు ఈ దొంగలను వెంబడించి కొందరిని పట్టుకోగలిగారు. 2 లక్షల రూపాయలూ దొరికినవని, దొంగలలో నలుగురు అరెస్టయినారని తెలియువచ్చింది.

ఉదయం 11-15 గం లకు వేళ బ్యాంకులో లావాదేవీలు బాగా సాగు ... పోయారు.

ఈ దుండగులు బ్యాంకునుండి రెండులక్షలు తీసుకొని త్వరత్వరగా కారులో వెళ్లిపోవాలని ప్రయత్నించారు. కాని ఇంతలో ప్రజలు బ్యాంకు ఎదుట గుమిగూడారు. వారిలో కొందరు దొంగలవెంటపడ్డారు. ప్రజలకు అశకలిగించడానికిగాను దుండగులు ఆ గుంపులలో నోట్లు వెదజల్లడం మొదలుపెట్టారు. కాని ప్రజలు వారిని వెంబడించడం మానలేదు.

ఇష్టం వచ్చినట్లు వారు తుపాకులు ...

# శ్రీ సంజీవరెడ్డి విశ్వాసం

(1 వ పేజీ తరువాయి)

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి తగిన ప్రాతిపదిక చర్యలు వారు పూనుకొని సన్నాహాలు చెయ్యవచ్చు. విభజన సంఘ తీర్మానాల ననుసరించి ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చెయ్యవలెనని ఆంధ్ర కాంగ్రెసు సర్వసభ్య సమావేశంచేసిన తీర్మానాన్ని తమిళ, కర్ణాటక కాంగ్రెస అధ్యక్షులకు పంపిస్తూ త్వరలోనే వారూ ఆ విధంగా తీర్మానం చెయ్యవలెనని కోరాను. వారు ఎన్నికలకు అభ్యర్థులను నిర్ణయించే తిదంగంలో నిమగ్నమై ఉన్నారు. వీలు చిక్కడంతోనే త్వరలోనే వారు ఆపని చెయ్యగలరని ఆశిస్తున్నాను. ఈ రెండు కాంగ్రెసు సంఘాలు తీర్మానించిన తర్వాత ఇక మద్రాసు మంత్రివర్గానికి ఏమీ అభ్యంతరం ఉండదు. వాళ్ళూ ఈతీర్మానానికి అంగీకరిస్తారు. భారత ప్రభుత్వ ప్రధానికికూడా మేముచేసిన తీర్మానాన్ని పంపించాను.

## "మద్రాసు ప్రభుత్వం సిఫార్సు చేస్తుంది"

మంత్రి చంద్రమౌళిగారి ప్రకటన

... గాలో పానకం పంచిపెట్టారు.

నేటిమధ్యాహ్నం స్వామీజీ దర్శనార్థమై వచ్చినవారిలో గుంటూరు మునిసిపల్ చైర్మన్ వుప్పుటూరి వెంకటపున్నయ్య, జి. వి. పున్నయ్య శాస్త్రి, కేరం సుబ్బారావు, నడింపల్లి నరసింహారావు, డా॥ టి. వి. ఎస్. చలపతిరావు, గురజా పురుషోత్తం, వున్నవ లక్ష్మీనారాయణగార్లు లోదలైన ప్రముఖులు చేరుకు న్నారు. ప్రాయోపవేశదీక్ష విరమింప చేసినందుకు ఆచార్య వినోబాజీకి, విరమించినందుకు స్వామీజీకి డా॥ అమంచర్ల చలపతిరావుగారు ధన్యవాదాలు సమర్పిస్తూ, ఆంధ్రరాష్ట్రవిభజన ఆసాంతం జరిగేవరకూ ఆంధ్రులు అప్రమత్తులై వుండాలని హెచ్చరించారు. ఆంధ్రులు కోరుతున్నది విశాలాంధ్ర స్థాపనమనీ, అట్టిది సంభవమయ్యేవరకు ఆంధ్రులు హోమీలలో నూ మంచిమాటలతో నూ సంతుష్టులు కారాదని హెచ్చరించారు.

ఆంధ్రమహాయజ్ఞానికి పూర్తి నిచ్చిన అన్ని ఆంధ్రసంస్థలకూ, స్వామీజీకి, ఆచార్య వినోబాజీకి అఖిలాంధ్రపక్షసమావేశాధ్యక్షులుగా వున్నవ లక్ష్మీనారాయణగారు ధన్యవాదాలు అర్పించారు ...

# వినయాశ్రమానికి స్వామీజీ ప్రయాణం

## సత్వర రాష్ట్రనిర్మాణం అవసరమని ఉద్ఘాటన

గుంటూరు సెప్టెంబరు 21: స్వామి సీతారాం, తమ అనుచరులతో కలసి, రేపు సాయంకాలం, వినయాశ్రమానికి ప్రయాణమవుతున్నారు. సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గురించి స్వామీజీ నిన్న యిలా అన్నారు. "ఆంధ్రరాష్ట్రం తక్షణంయేర్పడాలి. అలా జరగకపోతే వచ్చే సంవత్సరమో, యెన్నికల తరువాతనో, యేర్పడే రాష్ట్రానికి యిప్పటింత త్యాగం చేయవలసిన పనేలేదు. ఎన్నికల తరువాత రాష్ట్రం యేర్పడవచ్చు అని నేను వాగ్దత్త మాద్యోవహం శారీరకంగానే గాదు, ఆధ్యాత్మికంగా కూడా ఆత్మహత్య చేసుకొన్నట్లే అవుతుంది"

## రంగాగారి విశ్వాసం

## ప్రకాశంగారి ఆరోగ్యం

## స్వామి సీతారాం ప్రార్థనలు

## రామకృష్ణారావుగారి అభినందనలు

## అభినందనల పరంపర

## బిందుగారి హర్షం

## అఖిలపక్ష ఆంధ్రరాష్ట్ర స్థానికసంఘం

## ఢిల్లీనుండి ప్రధాన మేమీ రాలేదు

# మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 21.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటవరకు 1-కి ఎడ్వర్టైజ్మెంటు సేల్సుటాక్సుతోసహా రు. 78-4-0 పెట్టుబంగారు తులం 112 12 0 మూసబంగారు 100.0-0 సీమవెండి తులం 100-కి (తెడి) 189-8-0 వెండి తులం 1 కి 1-15-0.

వేరుశెనగ: (531 కా 1-కి ఎక్స్‌పోర్ట గిడ్డంగుల మెషిన్ సేల్సుటాక్సుతో సహా)

| | |
|---|---|
| పలని (బాయిల్డ) | రు. 176-180 |
| కరిది | రు. 182 183 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ బిల్లో 3% | |
| నామినల్ (500 పా.) | రు. 355-356 |
| కొబ్బరి నూనె (37½ పౌనులు గం డబ్బా) | |
| ఒకటి- ఏ బ్రాండ్ | |
| క్వీన్లాక్ | రు. 39 14 9 |
| యస్. బ్రాండ్ | 40 0-9 |

ఆముదం

| | |
|---|---|
| 500 పౌనులు గల బారువ ఒకటికి | |
| "తిరువత్తూర్" | రు. 400 0 0 |
| నరసారావుపేట" | రు. 410-0-0 |

పంచదార

| | |
|---|---|
| చిగలూర్ | రు. 103-4-8 |
| ... | రు. 103 14-5 |

## ఢిల్లీ మార్కెట్ ధరలు

## బొంబై వెండి బంగారు మార్కెట్

## హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్)

## ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవం: దరఖాస్తులు

## కావలెను

## అమ్మకము

## నోటీసు

## టెండరు నోటీసు

విజయనగరం మునిసిపాలిటి,

## దక్షిణ రైల్వే

## టెండరు నోటీసు

